

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే
అగజానన పద్మార్కం గజాననమహర్నిశం
అనేక దంతం భక్తానాం ఏకదంతముపాస్మహే

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ

# హిందుత్వ-టుడే

## మన దేశం – మన ధర్మం



**నిర్వహాకులు**
వినోద్ రెడ్డి
రాజ్యలక్ష్మి

**టెక్నికల్ సపోర్ట్**
గణేష్ రెడ్డి
రవీందర్ రెడ్డి

సహాయకులు అయ్యప్ప బన్నీ రెడ్డి

# ముందుమాట

ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరుల పాదపద్మాలకు నమస్కరిస్తూ.. అలాగే పరివార దేవతలకూ, భారతీయ ఋషులకూ, మునులకూ, సన్యాసులకూ, సాధుసంతులకూ, భగవద్భక్తులకూ, ఆధ్యాత్మిక వేత్తలకూ, సనాతన ధర్మ పరిరక్షకులకూ, పాఠకులకు అలాగే సర్వజనులకూ నమస్కరిస్తున్నాము. సనాతన వైదిక దేశమయినటువంటి భారత దేశంలో ఎంతో జ్ఞాన సంపద ఉంది. ఎంతో శాస్త్ర పరిజ్ఞానం ఉంది. అలాగే ఎందరో మహానుభావులు వారి జీవన విధానాలు, భారతీయ సంపదైనటువంటి వేదశాస్త్ర పురాణేతి హాసాదులు, భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, పద్ధతులు, సిద్ధాంతాలు సనాతన ధర్మము, హిందూ ధర్మము, వాటియొక్క పరిరక్షణ ఇలా ఆధ్యాత్మికత మాత్రమే కాక సమాజిక మరియు మాధ్యమిక స్థితిగతులతో దేశకాల విషయాలు, వాటి అంతరార్థాలు, వాటి స్వభావాలు, వాటి నుంచి మనం తెలుకోదగ్గ నేర్చకోదగ్గ జ్ఞానాన్ని అందరికీ డిజిటల్ రూపంలో నాగరిక ప్రపంచంలో అందరికీ చేరేలా కరవాణి ద్వారానే మీముందు నిలుస్తున్న డిజిటల్ వార పత్రిక శ్రీ "హిందుత్వ-టుడే" వార పత్రిక. ఇది సనాతన ధర్మంకోసం పాటుపడేవారిని ఉద్దేశించి వారికి దేశం, ధర్మం గురించి అన్ని విషయాలు తెలియాలనే దైవ సంకల్పంతో మేము ఈ ప్రైవేటు డిజిటల్ వారపత్రికకు శ్రీకారం చుట్టాము. దీని ద్వారా ఒక వ్యక్తిని గానీ, ఒకమతాన్ని గానీ, ఒక సంస్థను గానీ కించపరచాలన్న దురుద్దేశమేమీ లేదు. ఒకవేళ పొరబాటున అలా కనుక తెలియక తటస్థించిన యెడల మమ్ములను మన్నించి. మాకు దానిని తెలియజేస్తే మరల అటువంటివి జరగకుండా తగిన జాగ్రత్తలు తీసుకోగలమని సాదరంగా సెలవుతీసుకుంటున్నాము.ఈ మేగజైన్ యొక్క సంపద అంతా కూడా ఒకరికి చెందినది కాదు. అంటే ఇందులో ప్రచురింపబడే ప్రతీ విషయమూ కూడా సుజ్ఞానం కలవారు రచించి దానిని పంచిన దానిసే మేము పుస్తకాల ద్వారాగానీ, ఇంటర్నెట్ ద్వారా గానీ, సోషల్ మీడియా ద్వారాగానీ గ్రహించి మాత్రమే ఈయొక్క మేగజైన్లో ప్రచురించబడుతుంది. ఒకవేళ ఇందులోని ఏ విధమైన విషయమైనా ఒకరికి సంబంధించినది, అంటే వారు రచించినది కానీ వారు అర్హత పొందినది కానీ అయితే వారి వివరాలు మేము ఇక్కడ ఇవ్వకపోవడాన్ని తప్పుగా కానీ అహంకారమని కానీ తలచరాదు. ఆ విషయం నలుగురికి తెలియజేయడం, దాని ద్వారా ఇతరులకు ఆ జ్ఞానం పంచడమే ఈ మేగజైన్ యొక్క ప్రధాన లక్ష్యం. ఒకవేళ మీ ద్వారా రచించబడిన విషయమే కనుక ఇక్కడ మీకు తెలియకుండా ప్రచురించబడినట్లైతే దానికి మీ అర్హతను మీ పేరు ద్వారా చివరిలో మీరు ఆశిస్తే దానిని ప్రచురించడానికి మేము సిద్ధం. అది తరువాతి సంపుటిలోనైనా సరే మేము ప్రచురించగలము. మాకు కేవలం వారికి విషయం తెలియని తెలియజేయడమే ప్రధాన కర్తవ్యం తప్పించి ఇంకేమీ కాదు.

**ఇట్లు**

**హిందుత్వ టుడే**

# శ్రీ బలరామావతారము

## శ్రీ బలరామ జయంతి (శ్రీ భాద్రపద శుక్ల విదియ)



బలరామావతారము అంటే మహావిష్ణువు ధర్మ రక్షణకు ఎత్తిన దశ అవతారాలలో ఇది ఒకటి. బలరాములు వారు స్వయం భగవానుడు అయిన శ్రీకృష్ణుల వారికి సోదరులగా జన్మించిన అంశావతారము. వీరి ఆయుధము హలము, నాగలి. వీరు గొప్ప వీరులు, దయామయులు,కృష్ణుని అన్ని వేళలా తోడు గా ఉన్నవారు.
ఒకసారి కోపం వచ్చి యమునా నది దిశ మార్చినారు,
మరొకసారి హస్తినాపురాన్నే నేటి ఢిల్లీని తన హలాయుధంతో యమునలో కలప ఉద్యుక్తులయినారు.వీరు కురుక్షేత్ర యుద్ధమప్పుడు శాంతి కాముకులై తీర్థ యాత్రలు చేసినారు.
శ్రీకాకుళం జిల్లా నాగావళి నది ఆవిర్భావానికి ... నాగావళి నదీతీరాన పంచలింగాల ప్రతిష్టకి ఈయనే కారణము .

భారత భాగవతాలలో శ్రీకృష్ణ పరమాత్ముడి ప్రస్తావన వచ్చిన కొన్నికొన్ని సందర్భాలలో బలరాముడిని గురించి కూడా కొన్ని వివరణలు,కథలు కనిపిస్తాయి. బలరాముడు భగవానుడి దశావతారాలలో ఒక అవతారంగా కూడా ఉన్నాడు. శ్రీమహావిష్ణువు శ్వేతతేజస్సు బలరాముడుగానూ, నీలతేజస్సు శ్రీకృష్ణుడిగానూ అవతరించి దుష్టశిక్షణ కోసం తమ అవతార కాలాన్నంతా సద్వినియోగం చేసినట్లుగా అనిపిస్తుంది. దేవకీదేవికి సప్తమగర్భం కలిగింది. అప్పుడు దేవకిని, వసుదేవుడిని కంసుడు చెరసాలలో బంధించాడు. ఆ సమయంలో యముడు తన యామ్యమైన మాయతో దేవకీదేవి నుంచి గర్భాన్ని ఆకర్షించి రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టాడు. బలరాముడికి ఈ సందర్భంలోనే సంకర్షణుడు అనే పేరు వచ్చింది.
సంస్కృత మర్యాద ప్రకారం సమ్యక్ కర్షణాత్ అంటే సంపూర్తిగా ఆకర్షించడం వల్ల ఆయన సంకర్షణుడు అనే పేరుతో కూడా మనకు కనిపిస్తాడు. బలవంతులందరిలోనూ శ్రేష్టుడు కనుక బలదేవుడు అన్నారు. రామశబ్దానికి సుందరం అనే అర్ధం ఉంది కనుక ఆయన బలరాముడయ్యాడు. శ్రీకృష్ణుడికి అన్న అయిన బలరాముడు ఆదిశేషుడి అవతారం కూడా. సాందీప్ అనే గురువు దగ్గర బలరామకృష్ణులిద్దరూ విద్యాభ్యాసం చేశారు. ఈ బలరాముడు శ్రీకృష్ణుడిలాగే పాండవులంటే కొంత ఆదరాభిమానాలు కలిగివున్నా ఈయనకు కౌరవులలో దుర్యోధనుడంటే కూడా బాగా ఇష్టం అని కొన్ని కొన్ని భారత కథాఘట్టాల వల్ల తెలుస్తుంది. ఈయన భార్య పేరు రేవతీదేవి. నాగలి, రోకలి, బలరాముడి ప్రధాన ఆయుధాలు. ఎప్పుడూ నీలరంగు వస్త్రాలనే ధరిస్తుంటాడు. ఈయన జండామీద తాటిచెట్టు గుర్తు ఉంటుంది. గధాయుధంలో బలరాముడు గొప్ప ప్రావీణ్యాన్ని సంపాదించాడు. భీముడు, దుర్యోధనుడు ఇద్దరూ ఈయన దగ్గర గదాయుద్ధ విద్యను నేర్చుకున్నారు. విశేషించి దుర్యోధనుడు, పాండవులు వనవాసానికి వెళ్ళినప్పుడు భీముడిని జయించాలన్న లక్ష్యంతో ఈయన దగ్గర ఎన్నెన్నో గదాయుద్ధ మెళుకవలను నేర్చుకున్నాడు ద్రౌపది వివాహంలోనూ, ధర్మరాజు ఇంద్రప్రస్థ రాజధాని ప్రవేశ సమయంలోనూ శ్రీకృష్ణుడితోపాటుగా బలదేవుడు కూడా ఉన్నాడు.

అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ చిన్ననాటి నుంచి ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన సుభద్రను వివాహమాడటంకోసం యతి వేషంలో బలరాముడు దగ్గరకు వెళ్ళాడు. ఈ సందర్భంలో శ్రీకృష్ణుడు అర్జునుడికి సహకరించాడు కూడా. కానీ అర్జునుడు సుభద్రను అపహరించి చేపట్టడం బలరాముడికి నచ్చలేదు. అర్జునుడి సాహసాన్ని క్షమించలేనని బలరాముడు తీవ్రంగా కోపగించుకున్నాడు. అయితే శ్రీకృష్ణుడు అతడిని శాంతపరిచి కోపం తగ్గించుకునేలా చేశాడు.





పాండవులు వనవాసం చేసే రోజుల్లో తీర్థయాత్రలు చేస్తూ ప్రభాసతీర్థం దగ్గరకు వెళ్ళినప్పుడు బలరాముడు, మరికొందరు యాదవ వీరులను తీసుకొని వారిదగ్గరకు వెళ్ళి వారిని పరామర్శించాడు. ఆ తర్వాత వనవాసం, అజ్ఞాతవాసం అన్నీ పూర్తికావటం ఉత్తర, అభిమన్యుల వివాహం కూడా జరిగాయి. ఆ సందర్భంలో అక్కడ ఉన్న బలరాముడు పాండవులకు, కౌరవులకు హితకరంగా రాజ్యవిభాగం ఎలా జరిగితే బాగుంటుందో ఆలోచించాలన్నాడు. ఇక్కడే ఇతడికి దుర్యోధనుడంటే అభిమానం ఉందన్న విషయం వ్యక్తమవుతుంది. అయితే యుద్ధసమయంలో పాండవులు, కౌరవులు ఇద్దరూ తనకు కావాల్సివారేనని కనుక తాను ఏ పక్షానికి ఎలాంటి సహాయం చేయకుండా తటస్థంగా ఉన్నాడు. ఈ తటస్థ లక్షణాన్ని నిలుపుకోవడానికి ఆయన కురుక్షేత్ర యద్ధ సమయంలో సరస్వతీ నదీ తీరంలో ఉన్న తీర్థయాత్రలకు బయలుదేరి వెళ్ళాడు. నలభైరెండురోజుల తీర్థయాత్ర ముగించుకొని కురుక్షేత్ర సంగ్రామం చిట్టచివరిలో భీముడు, దుర్యోధనుడు గదాయుద్ధం చేసుకునే సమయానికి తిరిగి వచ్చాడు ఆ యుద్ధంలో భీముడు దుర్యోధనుడి తొడలు విరగగొట్టడం గదాయుద్ధ ధర్మం కాదని తీవ్రంగా తన నిరసనను, ఆగ్రహాన్ని వ్యకపరిచాడు. అయితే శ్రీకృష్ణుడు కలగజేసుకొని దుర్యోధనుడికి మైత్రేయ మహర్షి శాపం ఉందని, దాంతోపాటుగా భీముడు చేసిన ప్రతిజ్ఞ కూడా ఉందని గుర్తుచేసి సర్దిచెప్పడంతో కొద్దిగా బాధపడుతూనే రథమెక్కి ద్వారకకు వెళ్ళాడు. కురుక్షేత్ర యుద్ధం అయిన తర్వాత కొద్దికాలానికి మహర్షుల శాపం వలన యాదవ వంశం నాశనమైంది.

ఓ రోజున బలరాముడు, శ్రీకృష్ణుడు ఇద్దరూ అరణ్యానికి వెళ్ళారు. అక్కడ బలరాముడు ఓ చెట్టుకింద కూర్చొని ధ్యానంలో నిమగ్నమయ్యాడు. అప్పుడు ఆయన నోటినుంచి ఒక తెల్లటి సర్పం బయటకు వచ్చి పడమటి సముద్రంలో లీనమైంది. బలరాముడు ఆదిశేషుడి అంశ అని అనడానికి ఇది ఒక నిదర్శనం. శ్రీకృష్ణుడితోపాటే అనేక రాక్షసుల సంహారంలో పాల్గొన్న కృష్ణుడికి అన్నగా, తనదైన ఓ ప్రత్యేకతను బలరాముడు తుదిదాకా నిరూపించుకుంటూనే వచ్చాడు.



## శ్రీ వరాహావతారం

**శ్రీ వరాహ జయంతి శ్రీ భాద్రపద శుక్ల తదియ**



**"వసతి దశన శిఖరే ధరణీ తవ లగ్నా శశిని కలంక కలే**
**నిమగ్న కేశవ ధృత సూకర రూప జయజగదీశ హరే"**

వరాహ అవతారం ఎత్తిన ఓ కేశవ నీ కోరల మీద నిలపబడియున్న ఈ భూగోళం మచ్చలున్న చంద్రుని వలే ఉన్నది.

శ్రీ వరాహ స్వామి నక్షత్ర మండల రూపం విష్ణుమూర్తి మూడవ అవతారం సూకర నక్షత్ర మండలంగా ప్రసిద్ధి ఆది వరాహ రూపములో విష్ణుమూర్తి భూమిని తన మూతి అగ్రభాగాన నిలిపినట్లు శాస్త్రం.
హిరణ్యాక్షరాక్షసుడు భూమిని చాపలా చుట్టి ఎత్తుకు పోతుండగా, వరాహ స్వామి వాడిని చంపి భూమిని మట్టి గడ్డ ఆకారంలో తన మూతి భాగాన ధరించాడు అని పురాణం .

భూమి తన అక్షాంశం తప్పిపోయి శూన్యంలోకి జారి పోతుండగా సూర్యుని అయస్కాంత శక్తి తో కక్ష్యలో వుంచిన సైంటిఫిక్ విషయం చెప్పిన తీరిది. భూమి మట్టి గడ్డగా అనగా గోళాకారంలో వుందని పురాణాలు చెప్పాయి. అడవి పంది ఆకారంలో వుండే elliptical orbit భూమి పడిపోకుండా ఆపినట్లు భావన. elliptical orbit అనగా కోడి గుడ్డు ఆకారంలో భూమి సూర్యుని ఆకర్షణకు లోబడి తిరగడం.

విష్ణువు లోకపాలకుడు. సాధుపరిరక్షణకొఱకు, దుష్టశిక్షణ కొఱకు ఆయన ఎత్తిన 21 అవతారాలను ఏకవింశతి అవతారములు అంటారు. వానిలో అతిముఖ్యమైన 10 అవతారాలను దశావతారాలు అంటారు. ఈ దశావతారాలలో మూడవ అవతారము వరాహావతారము. హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు తన బలగర్వంతో భూమినంతటినీ చాపలా చుట్టి పాతాళలోకంలో దాగున్నాడు.

యజ్ఞవరాహమూర్తి యను సర్వేశ్వరుడు, ప్రాతార్మధ్యందిన తృతీయ సవనరూపుండు, మహా ప్రళయంబునందు యోగనిద్రావశుండై యుండు కాలమందు జలముల మునిగి, భూమి రసాతలగతంబైనందున, దానిని పైకి తీసుకువచ్చే ఉపాయంలో భాగంగా తాను మహా పర్వతమంతగా పెరిగిపోయాడు. ఆ పైన తన నిశిత కరాళక్షుర తీక్షంబులైన ఖురాగ్రంబుల సముద్ర జలమును చీల్చి రసాతలమును ప్రవేశించి భూమిని సమీపించెను. ఆ జల మధ్యంలో సూకరాకారుడైన హరికి హిరణ్యాక్షుడు ఎదురయ్యాడు. అప్పుడు, భూమిని తవ్వి తన నిశిత దంతాగ్రముల నిలిపి రాక్షస రాజు గుండెలు తల్లడిల్లునట్లు రణోత్సాముున రంకెలు వేస్తూ ఆ వరాహమూర్తి రణానికి సిద్ధమయ్యారు.
పైకి కనిపించని శక్తులు కలిగిన వరాహంతో యుద్ధంచేసి అలసి చివరికి మరణించాడు హిరణ్యాక్షుడు. అప్పుడా వరాహమూర్తి పాతాళంలో చుట్టగా పడిఉన్న భూమిని తన కోరలతో పై కి ఎత్తి అష్టదిగ్గజాలను ఆసరాగా ఏర్పరచి, వాటి తొండాలమీద భూమిని ప్రతిష్ఠించాడు. అప్పటినుంచి ఆ దిగ్గజాలే భూమి గతితప్పకుండా కాపాడుతున్నాయని పురాణ కథనం. అలా అవతరించిన వరాహరూపాన్ని యజ్ఞ వరాహరూపం అంటారు.

సృష్ట్యాదిలో భూమిని సుప్రతిష్ఠితం చేయడానికి ఎత్తిన యజ్ఞవరాహ జయంతి చైత్ర బహుళ త్రయోదశినాడు, హిరణ్యాక్షుడి బారినుంచి భూమిని రక్షించడానికి ఏర్పడిన వరాహరూప జయంతి భాద్రపద శుక్ల తృతీయ అని గ్రంథాల ఆధారంగా వెల్లడవుతోంది.



## వరాహ పురాణంలోని శ్రీ విఘ్నేశ్వర జననం

### వినాయక చవితి భాద్రపద శుక్ల చవితి



విఘ్నేశ్వర జన్మ వృత్తాంతంపై పలు రకాల గాథలున్నాయి. వాటిని ఒక్కొక్క పురాణం ఒక్కో విధంగా వర్ణించింది. వాటిలో వరాహ పురాణం పేర్కొన్న విఘ్నేశ్వర జన్మ వృత్తాంతం తక్కిన పురాణ కథలకు భిన్నంగా వుంది.ఈ పురాణం విఘ్నేశ్వరుడు ఆకాశం నుంచి జన్మించినట్లు చెప్పింది. రాక్షసుల బాధ ఎక్కువ కావడంతో ఆ బాధ నుంచి విముక్తి చెందే ఉపాయం చెప్పమని ఋషులు, దేవతలు శివుడిని అడిగారు. పరమ శివుడు ఈ విషయమై సుదీర్ఘంగా ఆలోచిస్తూ ఒకసారి తల ఎత్తి ఆకాశం వంక చూశాడు. అప్పుడు ఆయన కంటికి అత్యంత సుందరంగా పార్వతీదేవి కనిపించింది. శివుడు అప్రయత్నంగా పంచభూతాలలో తక్కిన వాటికంతా రూపం ఉండగా ఆకాశానికి ఎందుకు లేదు. అని ప్రశ్నించాడట.

జగజ్జనని అయిన పార్వతిని చూచి పరమ శివుడే అట్లా ప్రశ్నించడంతో ఆకాశం పుత్రరూపం దాల్చి శివుడి ఎదుట నిలిచింది. అదెంత సుందర రూపమంటే పార్వతిదేవి కూడా చంచల చిత్తంతో చూసిందట. ఆ బాలుడు ఇతర దేవతా స్త్రీలను కూడా అట్లాగే భ్రమింప చేయడంతో పరమ శివుడికి కోపం వచ్చి "నీవు ఏనుగు తల, బాన కడుపుతో వికార రూపుడవు కమ్మని శపించాడు" వెంటనే ఆకాశం నుంచి జన్మించిన ఆబాలుడు ఆ రూపంలోకి మారాడు.

ఈశ్వరుని వల్ల విఘ్నత చెందడం వల్ల ఆయనకు విఘ్నేశ్వరుడనే పేరు వచ్చింది. అంతటితో శివుడి కోపం చల్లారలేదు. ఆయన శరీరం చెమర్చింది. ఆ చెమట చుక్కల నుంచి వేలకు వేలు గజాస్యులు పుట్టుకొచ్చారు. ఆ తర్వాత దేవతలంతా పరమ శివుడిని ప్రార్థించి శాంత చిత్తుని చేశారు.

అలా పుట్టిన గజాస్యులు విఘ్నేశ్వరుని పరివారంగా ఉంటుందని గణాధిపతిగానేకాక ప్రతికార్యంలో ముందుగా విఘ్నేశ్వరుడు పూజింపబడతాడని శివుడు అనుగ్రహించాడు. కాబట్టి వరాహ పురాణం ప్రకారం విఘ్నేశ్వరుడు ఆకాశ స్వరూపమని తెలుస్తోంది.

అయితే ఏ విధంగా ఆవిర్భవించినా వినాయకుడు మాత్రం ఆది దంపతుల పుత్రుడే కనుక ఆ పార్వతీ నందనుడిని మనసారా సేవించి విఘ్నాల భారి నుండి బయటపడదాం.



ప్రకృతిహిత వినాయకుడిని పూజిద్దాం,
పర్యావరణాన్ని కాపాడుదాం...

ఏకదంతం మహాకాయం, తప్తకాంచనసన్నిభమ్...
లంబోదరం విశాలాక్షం, వందేహం గణనాయకమ్...

వినాయక చవితి
శుభాకాంక్షలు

# వినాయక చవితికి వాడే ఏకవిశంతి (21) పత్రి

ప్రకృతీం రక్షతి రక్షితః



## వినాయక చవితి పూజా పత్రితో ఆరోగ్య సంరక్షణ

**Ganapathi Puja Patri**
**21 Medicinal Plants**

మానవునికి ప్రకృతిలోని జీవజాలానికి ఉన్న అనుబంధాన్ని చాటి చెప్పే విశిష్టమైన పండుగ వినాయక చవితి. వినాయక పూజలో 21 రకాల ఆకులను పూజాపత్రిగా ఉపయోగిస్తాము. ఈ 21 రకాల మొక్కలు ఎంతో ఔషధ విలువలు కలిగినవి. వీటిని మన పెద్దలు తరతరాలుగా ఆరోగ్య సంరక్షణకు వినియోగిస్తున్నారు. ఈ విలువైన మొక్కల గుణగణాలను గణనాథుని పండుగ సందర్భంగా మనం నేర్చుకొని ఇంటిల్లిపాదీ ఉపయోగించుకుందాం.

**వక్రతుండ మహాకాయ కోటి సూర్య సమప్రభ !**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా !!**

## ఏకవిశంతి (21) పత్రాలు

ఓం సుముఖాయనమః - మాచీపత్రం పూజయామి॥
ॐ सुमुकाय नमः माची पत्रम पूजयामी

**1 మాచీ పత్రం** (మాచి పత్రి) :
*Artemesia vulgaris*

ఇది దద్దుర్లు, తలనొప్పి, వాత నొప్పులు, కళ్ళ సంబంధ వ్యాధులు, చర్మ సంబంధ వ్యాధులు, తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం గజాననాయనమః - దూర్వాయుగ్మం పూజయామి॥
ॐ गजाननाय नमः दूरवा युगमम पूजयामी

**4 దూర్వాయుగ్మం** (గరిక) :
*Cynodon dactylon*

ఇది గాయాలు, చర్మ వ్యాధులు, దద్దుర్లు, మూత్రంలో మంట, ముక్కు సంబంధ వ్యాధులు, ఉదర సంబంధ వ్యాధులు, అర్శ మొలల నివారణకు ఉపయోగపడుతుంది.



ఓం గుహాగ్రజాయనమః - అపామార్గ పత్రం పూజయామి॥
ॐ गुहाग्रजाय नमः अपामार्ग पत्रम पूजयामी

**7 అపామార్గ పత్రం** (ఉత్తరేణి) :
*Achyranthus aspera*

ఇది దంత ధావనానికి, పిప్పి పన్ను, చెవి పోటు, రక్తం కారటం, అర్శమొలలు, ఆణెలు, గడ్డలు, అతి ఆకలి, జ్వరం, మూత్ర పిండాలలో రాళ్ళు తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం వికటాయనమః - కరవీరపత్రం పూజయామి॥
ॐ विकटाय नमः करवीर पत्रम पूजयामी

**10 కరవీర పత్రం** (గన్నేరు) :
*Nerium odorum*

ఇది కణుతులు, తేలు కాట్లు, విష కీటకాల కాట్లు, దురద, కళ్ళ సంబంధ వ్యాధులు, చర్మ సంబంధ వ్యాధులు తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం సర్వేశ్వరాయనమః - దేవదారు పత్రం పూజయామి॥
ॐ सर्वेश्वराय नमः देवदारू पत्रम पूजयामी

**13 దేవదారు పత్రం** (దేవదారు) :
*Erythroxylum monogynum*

ఇది అజీర్తి, పొట్ట సంబంధ వ్యాధులు, చర్మ వ్యాధులు, కంటి సంబంధ వ్యాధులు తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం శూర్పకర్ణాయనమః - జాజీ పత్రం పూజయామి॥
ॐ शूर्पकर्णाय नमः जाजी पत्रम पूजयामी

**16 జాజీ పత్రం** (జాజిఆకు) :
*Jasminum auriculatum*

ఇది వాత నొప్పులు, జీర్ణాశయం వ్యాధులు, మలాశయం వ్యాధులు, నోటిపూత, దుర్వాసన, కామెర్లు, చర్మవ్యాధులు, తగ్గించడానికి, ఉపయోగపడుతుంది.



ఓం వినాయకాయనమః - అశ్వత్థ పత్రం పూజయామి॥
ॐ विनायकाय नमः अश्वथ पत्रम पूजयामी

**19 అశ్వత్థ పత్రం** (రావిఆకు) :
*Ficus religiosa*

ఇది మలబద్ధకం, కామెర్లు, వాంతులు, మూత్ర వ్యాధులు, జ్వరాలు, నోటిపూత, చర్మవ్యాధులు నివారించడానికి ఉపయోగపడుతుంది. జీర్ణశక్తి, జ్ఞాపక శక్తి పెంపొందిచడానికి ఉపయోగపడుతుంది.



ఓం గణాధిపాయనమః - బృహతీపత్రం పూజయామి॥
ॐ गणादिपाय नमः ब्रुहती पत्रम पूजयामी

### 2 బృహతీ పత్రం (వాకుడాకు):

*Solanum xanthocarpum*

ఇది దగ్గు, జలుబు, జ్వరము, అజీర్ణం, మూత్ర వ్యాధులను, నేత్ర వ్యాధులను నయంచేయడానికి, దంత ధావనానికి, ఉపయోగపడుతుంది.



ఓం ఉమాపుత్రాయనమః - బిల్వపత్రం పూజయామి॥
ॐ उमा पुत्राय नमः बिल्व पत्रम पूजयामी

### 3 బిల్వ పత్రం (మారేడు):

*Aegle marmelos*

ఇది జిగట విరేచనాలు, జ్వరం, మధుమేహం, కామెర్లు, నేత్ర వ్యాధులు, శరీర దుర్గంధం తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం హరసూనవేనమః - దత్తూరపత్రం పూజయామి॥
ॐ हरसूनवे नमः दत्तूर पत्रम पूजयामी

### 5 దత్తూర పత్రం (ఉమ్మెత్త):

*Datura metel*

ఇది సెగ గడ్డలు, స్తన వాపు, చర్మ వ్యాధులు, పేను కొరుకుడు, శరీర నొప్పులు, శ్వాసకోశ వ్యాధులు, ఋతు వ్యాధుల నివారణకు ఉపయోగపడుతుంది. ఇది విషం కాబట్టి జాగ్రత్తగా వాడుకోవాలి.



ఓం లంబోదరాయనమః - బదరీపత్రం పూజయామి॥
ॐ लम्बोदराय नमः बदरी पत्रम पूजयामी

### 6 బదరీ పత్రం (రేగు):

*Zizyphus jujuba*

ఇది జీర్ణకోశ వ్యాధులు, రక్త సంబంధ వ్యాధులు, చిన్న పిల్లల వ్యాధుల నివారణకు, రోగ నిరోధక శక్తి పెంపుదలకు ఉపయోగపడుతుంది.



ఓం గజకర్ణాయనమః - తులసీపత్రం పూజయామి॥
ॐ गजकर्णायनमः तुलसी पत्रम पूजयामी

### 8 తులసీ పత్రం (తులసి):

*Ocimum sanctum*

ఇది దగ్గు, జలుబు, జ్వరం, చెవి పోటు, పన్ను నొప్పి, తుమ్ములు, చుండ్రు, అతిసారం, గాయాలు తగ్గించడానికి ఉపయోగపడుతుంది. ముఖ సౌందర్యం, వ్యాధి నిరోధక శక్తి పెంపొందిచడానికి ఉపయోగపడుతుంది.



ఓం ఏకదంతాయనమః - చూతపత్రం పూజయామి॥
ॐ ऐकदन्ताय नमः चूत पत्रम पूजयामी

### 9 చూత పత్రం (మామిడాకు):

*Mangifera indica*

ఇది రక్త విరేచనాలు, చర్మ వ్యాధులు, ఇంటిలోని క్రిమి కీటకాల నివారణకు ఉపయోగపడుతుంది.



ఓం భిన్న దంతాయనమః - విష్ణుక్రాంత పత్రం పూజయామి॥
ॐ बिन्नदन्ताय नमः विष्णुक्रांत पत्रम पूजयामी

### 11 విష్ణుక్రాంత పత్రం (విష్ణుకాంత):

*Evolvulus arvensis*

ఇది జ్వరం, కఫం, పడిశం, దగ్గు, ఉబ్బసం తగ్గించడానికి, జ్ఞాపకశక్తి పెంపొందించడానికి ఉపయోగపడుతుంది.



ఓం వటవేనమః - దాడిమీ పత్రం పూజయామి॥
ॐ वटवे नमः दाडिमी पत्रम पूजयामी

### 12 దాడిమీ పత్రం (దానిమ్మ):

*Punica granatum*

ఇది విరేచనాలు, అతిసారం, దగ్గు, కామెర్లు, అర్శ మొలలు, ముక్కు నుండి రక్తం కారడం, కండ్ల కలకలు, గొంతు నొప్పి, చర్మ వాధులు తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం ఫాలచంద్రాయనమః - మరువక పత్రం పూజయామి॥
ॐ फालचन्द्राय नमः मरूवक पत्रम पूजयामी

### 14 మరువక పత్రం (మరువం):

*Marjorana hortensis*

ఇది జీర్ణశక్తి, ఆకలి పెంపొందించుటకు, జుట్టు రాలడం, చర్మ వ్యాధులు తగ్గించుటకు ఉపయోగపడుతుంది. దీనిని సువాసనకు ఉపయోగిస్తారు.



ఓం హేరంభాయనమః - సింధువార పత్రం పూజయామి॥
ॐ हेरम्बाय नमः सिन्दुवार पत्रम पूजयामी

### 15 సింధువార పత్రం (వావిలి):

*Vitex negundo*

ఇది జ్వరం, తలనొప్పి, కీళ్ల నొప్పులు, గాయాలు, చెవిపోటు, చర్మ వ్యాధులు, మూర్ఛ వ్యాధి, ప్రసవం తరువాత వచ్చే ఇబ్బందులను తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



ఓం సురాగ్రజాయనమః - గండకీ పత్రం పూజయామి॥
ॐ सूराग्रजाय नमः गंडकी पत्रम पूजयामी

### 17 గండకీ పత్రం (దేవకాంచనం):

*Bauhinia variegata*

ఇది మూర్ఛ వ్యాధి, కఫం, పొట్ట సంబంధ వ్యాధులు, నులిపురుగుల నివారణకు ఉపయోగపడుతుంది. దీని ఆకులు ఆహారంగా కూడా ఉపయోగిస్తారు.



ఓం ఇభవక్త్రాయనమః - శమీ పత్రం పూజయామి॥
ॐ इभवक्त्राय नमः शमी पत्रम पूजयामी

### 18 శమీ పత్రం (జమ్మి ఆకు):

*Prosopis cineraria*

ఇది కఫం, మూల వ్యాధి, కుష్ఠు వ్యాధి, అతిసారం, దంత వ్యాధులు నివారించడానికి ఉపయోగపడుతుంది.



ఓం సురసేవితాయనమః - అర్జున పత్రం పూజయామి॥
ॐ सूरसेविताय नमः अर्जून पत्रम पूजयामी

### 20 అర్జున పత్రం (తెల్లమద్ది):

*Terminalia arjuna*

ఇది చర్మ వ్యాధులు, కీళ్లనొప్పులు, మలాశయ దోషాలు, గుండె జబ్బుల నివారణకు ఉపయోగపడుతుంది.



ఓం కపిలాయనమః - అర్క పత్రం పూజయామి॥
ॐ कपिलाय नमः अर्क पत्रम पूजयामी

### 21 ఆర్క పత్రం (జిల్లేడు):

*Calotropis procera*

ఇది చర్మ వ్యాధులు, సెగగడ్డలు, కీళ్ల నొప్పులు, చెవిపోటు, కోరింత దగ్గు, దంతశూల, విరేచనాలు, తిమ్మిర్లు, బోదకాలు, వ్రణములు తగ్గించడానికి ఉపయోగపడుతుంది.



మట్టి గణపతులనే వాడుదాం పర్యావరణాన్ని కాపాడుదాం

# ఋషి పంచమి

## భాద్రపద శుక్ల పంచమి



భవిష్యోత్తర పురాణం ఈ ఋషి పంచమి వ్రత ప్రాశస్త్యమును వివరిస్తోంది. పేరుకు ఋషి పంచమి అయినా ఇది పూర్తిగా స్త్రీలకు సంబంధించిన వ్రతంగా చెప్పబడినది. ఒకనొకప్పుడు సివాశ్వుడు అనే రాజు స్త్రీల పాపాల్ని తక్షణమే హరించే వ్రతం గురించి అడుగగా బ్రహ్మ ఈ వ్రతాన్ని ఉపదేశించినట్లుగా " వ్రతకల్పం" పేరుకొన్నది. పూర్వం విదర్భలో ఉత్తంగుడనే బ్రాహ్మణునకు బాలవితంతువు అయిన ఒక కుమార్తె, వేదాధ్యయనం చేసే ఒక కుమారుడు ఉన్నారు. విద్యార్ధులకు వేదం నేర్పుతూ ఈ బ్రాహ్మణుడు జీవనం చేస్తు ఉండగా,ఒక రోజు ఆయన కుమార్తె దేహం నుండి పురుగులు రాలిపడ్డాయి. ఈ సంఘటన తో ఆ బాలిక స్పృహతప్పి పడిపోగా, ఉత్తంగుడు తన ఉపాసనా బలం వలన ఆమె పూర్వ జన్మలో రజస్వల అయి ఉండి , ఇంటిలోని అన్నపు గిన్నెలను ముట్టుకోవడం వలన తన కుమార్తె దేహం క్రిమిభూయిష్టమైనదని తెల్సుకున్నాడు .అప్పుడా బాపడు తన కూతురు చేత ఋషిపంచమీ వ్రతాన్ని చేయించి, గత జన్మలో ఆమె రజస్వలగా ఉన్న సమయంలో చేసిన పాపాలను హరించివేశాడు. భాద్రపద శుద్ధ పంచమి నాడు ఏ స్త్రీ అయితే ఈ వ్రతాన్ని నిష్ఠగా ఆచరిస్తుందో, అమె రజస్వలగా ఉండి చేసిన దోషాలన్నీ హరించబడతాయి.

పూర్వకాలంలో ఇంద్రుడు వృతాసుర వధ చేసి బ్రహ్మహత్యా పాతకం పొందాడు.అప్పుడు ఇంద్రుడు తన పాపం లో ఒక పావు వంతు భాగాన్ని ద్త్రీలకు ఇచ్చాడు. ఆనాటి నుండి స్త్రీలు రజో ధర్మాన్ని పొంది,రజస్వలలు కావడం ప్రారంభమైనది. రజస్వలా కాలంలో వారు తెలిసి తెలియక చేసే పాపాలను పోగొట్టడానికి బ్రహ్మ ఈ ఋషిపంచమి వ్రతాన్ని కలిపంచాడాని పురాణ కథనం.

విదర్భలో శ్వేతజితుడనే క్షత్రీయుడు, సుమిత్ర అనే ఒక బ్రహ్మ న స్త్రీ ఉండేవారు. శ్వేతజితుడు కృషి కర్మలో ఉండటం వలన,తెలియక రజస్వల, అయిన స్త్రీలను తాకడం , వారితో సంభాషించడం వంటి పనులు చేశాడు. సుమిత్ర కూడా రజస్వలగా ఉన్నా అందర్నీ ముట్టుకుంటు ఉండేది. అవసానకాలంలో వారు ఇద్దరూ మృతి చెంది, సుమిత్ర కుక్క గానూ, శ్వేతజితుడు ఎద్దుగానూ సుమిత్ర కొడుకైన గంగాధరుని ఇన్ తినే జన్మించారు.
కాలం గడుస్తున్నది.సుమిత్ర శ్రద్ధదినం వచ్చింది. గంగాధరుడు శ్రద్ధగా. శ్రాద్ధ క్రియ ఆచరించి, బియ్యపు పరమాన్నాన్ని నైవేద్యంగా సమర్పించేలోగా,పాయసాన్ని ఒక పాము ముట్టడం చూసిన కుక్క, అతిథులకు ఆ పాయసం పెడితే మరణిస్తారని తలంచి,అందరూ చూస్తూండగానే తాను ఆ పాయసాన్ని ఎంగిలి చేసింది. కుక్కముట్టిన పాయసం పనికి రాదు కనుక వంటది మళ్ళీ పాయసం వండి తిథులను తృప్తు పరచింది.కానీ కుక్క పాయసాన్ని ముట్టినందున కోపంతో, ఆ రోజు దానికి ఆహారం ఇవ్వలేదా వంటది.
కుక్కరూపంలో ఉన్న తనని తెలియక కొడుకు సైతం తనపట్ల నిర్లక్ష్యం వహించడం చూసిన సుమిత్ర ఈనాడు నా కొడుకు చేసిన స్రాద్ధ వ్యర్థం అయింది కదా! అని ఎద్దురూపంలో ఉన్న క్షత్రియునకు చెప్పుకుంది. ఈ రెండు మూగ జీవాల భాషను తెల్సిన గంగాధరుడు మర్నాడు తన గురువు వద్దకు వెళ్ళి,వాళ్ళ శాపవృత్తాంతము తెల్సుకుని, తాను ఋషిపంచమి వ్రతాన్ని ఆచరించి, వారికి పశుజన్మల నుండి విముక్తి కలిగించి, ఉత్తమ గతులు పొందినట్లు చేసి మాతృఋణ విముక్తుడయ్యాడు.

**ఈ వ్రతం ఎల ఆచరించాలి..?**

ఋషిపంచమి వ్రతం ప్రాయశ్చితాత్మకమైన వ్రతం. ఈ వ్రతం విధానాలు మనలో చాల మందికి తెల్సినా ఆచరించేవాళ్ళు తక్కువ! ఒకవేళ ఆచరించినా చాల అశాస్త్రీయంగా చేయడం విచారకరం.
పంచమినాటి తెల్లవారు జామున స్త్రీలు స్నానం చేసి పుష్పసంచయనం చేయాలి. స్నానం చేస్తున్న సమయంలోనే వ్రత సంకల్పాన్ని చెప్పుకోవాలి. అనంతరం గణపతి పూజ పూర్తిచేసి,ఉత్తరేణి మొక్కకు పూజసల్పి,దాన్ని సమూలంగా పెరికివేసి,దాని కొమ్మతో దంతధావనం ( పళ్ళుతోమడం) చేయాలి. పుణ్యస్త్రీలు విభూతి, గోపిచందనం, పంచగవ్యములతో స్నానమాచరించాలి. ఈ తంతు ముగియగానే ఆకశంలోని సప్తఋషులని, అరుంధతిని చూస్తూ ఋషి పూజ చేయాలి.
పూజలో నాల్గువత్తుల దీపం ఉండాలి. పూజానంతరం, భోజనంలో బర్రె పెరుగు, వేయించిన శనగలు, తోటకూర కూరను భుజించాలి.
వివాహితలు ఈ వ్రతంవల్ల భర్త ప్రేమనూ, వితంతువులు రాబోయే జన్మలో ఆయుష్మంతుడైన భర్తను పొందుతారని " వ్రతోత్సవ చరిత్ర " స్పష్టం చేస్తున్నది. ఋషిపంచమి మధ్యానకాల వ్యాపిని అయి ఉండాలి. పంచమి తిధి ఉభయదినవ్యాపినిగా ఉంటే మొదటిరోజునే ఈ వ్రతం ఆచరించాలి.
నీలమతపురాణం ఋషిపంచమిని వరుణపంచమిగానూ, జ్యోతిషీ రక్షాపంచమిగానూ, స్మృతి కౌస్తుభమౌ - చతుర్వర్గ చింతామణి - పురుషార్ధ చింతామణి వంటి పలు ప్రాచీన గ్రంథాలు" ఋషిపంచమి" గానూ పేర్కొనడం జరుగింది. నామాలు వేరు అయినప్పటికి స్త్రీలు ఈ రోజున ఈ రోజున ఋషిపంచమి వ్రతాన్ని ఆచరించినట్లూయితే జన్మ జన్మలందు రజస్వలయై చేసిన దోషములు హరించబడతాయి. ఇది స్త్రీల వ్రతం. ప్రతి స్త్రీ ఆచరించవల్సిన వ్రతం.

# జనగణమనలో అధినాయక ఎవరు...?

మన జాతీయ గీతంపై విమర్శలు ఈనాటివి కావు. ఐదవ జార్జి చక్రవర్తి గురించి పొగుడుతూ 'జనగణాలకు వారి మనస్సులకు అధినాయకుడిపైన ఓ నాయకా, నీకు జయము కలుగు గాక. ప్రజలందరి మనసుకు అధినేతవు. భారత భాగ్యవిధాతవు అయిన నీకు జయమగుగాక. సకల జనులకు మంగళ కారకుడవు, భారత భాగ్య విధాతవు అయిన నీకు జయమగు గాక! జయమగుగాక! జయమగుగాక!' అని రవీంద్ర నాథ్ ఠాకూర్ గీత రచన చేసి స్వాగతంపలికాడు అని అంటారు .





విక్టోరియారాణికి కూడా ఇదేగీతంతో రవీంద్రనాథ్ స్వాగతం పలికాడు....
ఇటువంటి ఆంగ్లేయుల గులాములే జాతినాయకులుగా...చరిత్రపుటలకెక్కారు. నోబెల్ పురస్కారం రవీంద్రనాథ్ ని ఆవిదంగానే వరించింది. జనగణమన ను రవీంద్రనాథ్ తొలుత బెంగాలీ లో రచించారు. దీని హిందీ వర్షన్‌ను జాతీయ గీతంగా 1950 జనవరి 24న రాజ్యాంగ సభ ఆమోదించింది. రవీంద్రుడు రచించిన జనగణమన గీతంలో మొత్తం ఐదు పేరాలుండగా, కేవలం మొదటి పేరాను మాత్ జాతీయగీతంగా స్వీకరించారు. జాతీయ గీతాన్ని తొలిసారిగా 1911 డిసెంబర్ 27న కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ఆలపించారు. జాతీయ గీతానికి పాడవలసిన సమయాన్ని అప్పట్లో 52 సెకండ్లుగా ఖరారుచేశారు.
కాంగ్రెస్ వర్కింగ్ కమిటి 1935 లో జనగణమన జాతీయగీతంగా ఉండాలని తీర్మానించింది. అప్పుడే ఈ తీర్మానంపై విమర్శలు మొదలయ్యాయి. 'జనగణమన'ను 1950 జనవరి 24న జాతీయ గీతంగా భారత ప్రభుత్వం ప్రకటించింది.
భారత రిపబ్లిక్‌కు తొలి రాష్ట్ర పతిగా డా రాజేంద్రప్రసాద్ ఎన్నికైన రోజే జనగణమనను జాతీయ గీతంగా ప్రకటించారు. బంకించంద్ర ఛటర్జీ రాసిన వందేమాతరం గీతానికి జాతీయ గీతంతో సరిసమానమైన గౌరవం ఉంటుందని రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ఆ నాటి సభలో ప్రకటించారు. అయితే వందేమాతరమే జాతీయగీతంగా ఉండాలనే ప్రతిపాదన కూడా బలంగా వచ్చింది. ముస్లింలు, కాంగ్రెస్‌లోని కొన్ని వర్గాలు దానిని వ్యతిరేకించారు. జాతీయగీతంపై చర్చ జరగడం ఇష్టంలేని పాలకవర్గాలు 'జనగణమన' ను హడావిడిగానే జాతీయగీతంగా నిర్ణయించి ఆ వివాదం సద్దుమణిగేలా చేశారు. ఆ గీతమే నేటికీ కొనసాగేలా చేశారు.ఈ అంశం గురించి ఎవరూ పట్టించుకోవడం లేదు. అసలు చాలామందికి తెలియదు కూడా. అంటే ఈ రోజుకి కూడా ఆంగ్లేయులనే మనం అదినాయకులుగా కీర్తిస్తున్నమా !

మనకి స్వతంత్రం వచ్చి 71 సం.లు అయినా వారికీ ఇంకా మనం బానిసలమనే భావన మన లో పోలేదా..?

జనగణమన అధినాయక జయహే భారత భాగ్యవిధాత. భారతదేశంయెుక్క సర్వజనుల మనస్సులకు అధినాయకా నీకు జయము...నీవు భారతదేశ భాగ్యరేకను లిఖించు బ్రహ్మవు....

పంజాబ సింధు గుజరాత్ మరాఠా ద్రావిడ ఉత్కలవంగ
తవశుభనామేజాఘే తవశుభ ఆశిషమాగే:

ఆసేతు హిమాచలం పంజాబ్,సింధు,గుజరాత్,మరాఠా,ద్రావిడ,ఉద్గల,వంగ మెదలైన వర్గాల సమస్త ప్రజానీకమూ ఉదయమునేలేచి నీశుభకరమైన ఆశీర్వాదములు కోరుచున్నారు....

గాహే తవజయగాధ: మీ వీరగాదలు ఆలపిస్తున్నారు.....

వింధ్యహిమాచల యమునా గంగ ఉఛ్చలజలధితరంగా తవశుభనామేజాహే తవశుభ ఆశిషమాంగే గాహే తవజయగాధా::: వింధ్యహిమాచలం నుండి ప్రవహించు యమునా గంగా నదులతరంగాలు సైతం మీవీర నామంకీర్తిస్తూ మీజయము కోరుచున్నవి
(భగవంతుణ్ణి కూడా ఇంతదీనంగా ఎవడూ అడుక్కోడు)

జాతీయ గీతం 'జనగణమన'లోని అధినాయక్ పదాన్ని తొలగించాలని రాజస్థాన్ గవర్నర్ కల్యాణ్ సింగ్ గత ఏడాది డిమాండ్ చేశారు. 'జనగణమన అధినాయక్ జయహో' వాక్యంలో అధినాయక్ ఎవరని ఆయన ప్రశ్నించారు. ఆ పదం ఆంగ్లేయుల పాలనను పొగిడేలా ఉందని ఆయన అభిప్రాయ పడ్డారు. ఆ వాక్యాన్ని 'జనగణమన మంగళ్ గాయే'గా మార్చాలని సూచించారు.

జనగణమన గీతాన్ని జాతీయ గీతంగా పాడుతున్నప్పటికీ.. అసలైన జాతీయ గీతం మాత్రం వందేమాతరమేనని ఆరెస్సెస్ జనరల్ సెక్రటరీ భయ్యాజీ జోషి కొంత కాలం క్రితం వ్యాఖ్యానించారు. రాజ్యాంగం ప్రకారం జనగణమన ఉంది కాబట్టి దాన్ని తామూ గౌరవిస్తామని అన్నారు. మన జాతికి సంబంధించి పూర్తి భావం, దేశ వ్యక్తిత్వం వందేమాతర గీతంలోనే ప్రతిబింబిస్తుందని పేర్కొన్నారు. జనగణమన గీతంలో నాటి ప్రభుత్వ విధానాలు కనిపిస్తాయి. వందేమాతర గీతంలో మాత్రం దేశ వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. మాతృభూమికి వందనం చేయడమే వందేమాతరం. ఇదే ఈ రెండింటికీ మధ్య ఉన్న తేడా. సరైన అర్థం తీసుకుంటే వందేమాతర గీతమే మన జాతీయ గీతం కావాలి.. అని భయ్యాజీ జోషి వ్యాఖ్యానించారు.

మన ప్రభుత్వం ఇప్పుడైనా ఈ విషయం పై స్పందించాలి

# సనాతన ధర్మంలో స్త్రీలకు ఇచ్చిన విలువ

## వేదాల ఆధారంగా



వేదాలు స్త్రీలను తొక్కేశాయని, స్త్రీలకు స్వేఛ్ఛనివ్వలేదని చాలా ఆరోపణలు చేస్తుంటారు. విద్యార్ధుల పాఠశాల చదువుల్లో, ఐఏఎస్ అభ్యర్ధులకు, ఇతర ఉద్యోగార్ధులకు నిర్వహించే పరీక్షల్లో ఉండే చరిత్రలో కూడా ఇదే వాదన కనిపిస్తుంది. ఇక తమనుతాము సంఘసంస్కర్తలమనీ, అభ్యుదయవాదులమని చెప్పుకునే కొందరు కుహనా మేధావులు ఈ విషయంలో వైదికసంస్కృతిపై దుమ్మెత్తిపోస్తుంటారు. అసలు వేదాలు స్త్రీల గురించి ఏమన్నాయో కొన్ని విషయాలు చూద్దాం.

స్త్రీలు ధైర్యవంతులుగా ఉండాలి - యజుర్వేదం 10.03
స్త్రీలు మంచి కీర్తి గడించాలి - అధర్వణవేదం 14.1.20

స్త్రీలు పండితులవ్వాలి - అధర్వణవేదం 11.5.18
(స్త్రీలు కూడా విద్యాబోధన చేయాలని చెప్తోంది)
స్త్రీ అందరిని జ్ఞానవంతుల్ని చేయాలి - అధర్వణవేదం 14.2.74
స్త్రీ ఎప్పుడూ సంపదలతో సుఖంగా ఉండాలి - అధర్వణవేదం 7.47.2
స్త్రీలు ఎప్పుడూ జ్ఞానవంతులై, తెలివిగలవారై ఉండాలి - అధర్వణవేదం 7.47.1

పరిపాలన విషయంలో స్త్రీలు
పరిపాలనకు సంబంధించిన సభలు, సమావేశాల్లో స్త్రీలు కూడా పాల్గొనాలి - అధర్వణవేదం 7.38.4
దేశపరిపాలన, సామాజిక సంస్కరణలు, ప్రభుత్వ కార్యకలాపాలను స్త్రీలు ముందుండి నడిపించాలి- ఋగ్వేదం 10.85.46
ఈ రోజుక్కూడా ప్రపంచంలో స్త్రీలు పైకి రాకుండా అణిచివేస్తున్నారు. కానీ వేదం ఎంతో స్పష్టంగా స్త్రీల నాయకత్వం గురించి వివరించింది.

ఆస్తిహక్కు
పిత్రార్జితం (తండ్రి కూడబెట్టిన ఆస్తి) లో కుమారుడితో కుమార్తెకు కూడా సమానమైన హక్కు ఉంది- ఋగ్వేదం 3.31.1

కుటుంబం
సమాజానికి, కుటుంబానికి స్త్రీ రక్షకురాలిగా వ్యవహరించాలి- అధర్వణవేదం 14.1.20
స్త్రీ సంపదను, ఆహారాన్ని అందించాలి. శ్రేయస్సును కలిగించేదై ఉండాలి- అధర్వణవేదం 11.1.17 (స్త్రీకి సంపాదన ఉన్నప్పుడే ఆమె కుటుంబానికి సంపదను చేకూర్చగలుగుతుంది)
నీ భర్తకు సంపాదించే మార్గాలు నేర్పించు- అధర్వణవేదం 7.46.3

ఉద్యోగాల్లో
స్త్రీలు కూడా రధాలను నడపాలి- అధర్వణవేదం 9.9.2
స్త్రీలు యుద్ధంలో పాల్గొనాలి- యజుర్వేదం 16.44 (ఈ విషయంలో దుర్గాదేవియే స్త్రీలకు ఆదర్శం. స్త్రీలు బయటకురాకూడదని వైదిక ధర్మం చెప్పిందంటూ అసత్య ఆరోపణలు చేస్తున్నారు. కానీ వేదం స్త్రీలను యుద్ధంలో కూడా పాల్గొనవలసిందిగా చెప్పింది. కైకేయి దీనికి ఉదాహరణ కదా. శ్రీ రామాయణంలో కైకయి అడిగిన వరం వల్లనే రాముడు వనవాసానికి వెళతాడు. దశరధుడితో కలిసి శత్రువులపై యుద్ధం చేసిన సమయంలో, ఆమె పరాక్రమం చూసి ఆమెను వరం కోరుకోమనగా, సమయం వచ్చిన అడుగుతానంటుంది. ఇతిహాసంలో అదే పెద్ద ఉదాహరణ).
కమాండర్ తరహాలో స్త్రీ సభలను ఉద్దేశించి ప్రసంగించాలి- ఋగ్వేదం 10.85.26

విద్యా విషయాల్లో
ఓ స్త్రీల్లారా! పురుషలతో సమానంగానే మీకు ఈ మంత్రాలు ఇవ్వబడ్డాయి. మీ భావాల్లో సామరస్యం ఉండుగాకా. మీరు ఎటువంటి వివక్ష చూపక, అందరికి జ్ఞానాన్ని పంచుదురుగాకా. మీ మనసు, చైతన్యం సమన్వయంతో పనిచేయాలి. నేను (ఋషి) పురుషులతో సమానంగా మీకు ఈ మంత్రాలను ఇవ్వడమేగాక, వీటిని అర్దం చేసుకునే శక్తిని మీకు ప్రసాదిస్తున్నాను- ఋగ్వేదం 10-191-3

వేదాల్లోనే మైత్రేయి, గార్గి, లోపాముద్రా వంటి దాదాపు 30 పైగా మంత్రద్రష్టలైన స్త్రీ ఋషుల గురించి చెప్పబడింది. ఒక్క హిందూ ధర్మంలో తప్ప మరే ఇతర మతంలోనూ స్త్రీదేవతలు ఉండరు. అన్యమతాల్లో ఎక్కడా కూడా స్త్రీలకు భగవంతుడు తన దివ్యసందేశం ఇచ్చినట్టుగా లేదు.

వివాహం - విద్యాభ్యాసం
ఓ వధువా! (వధువు అంటే పెళ్ళికూతురు) వైదికజ్ఞానం నీకు అన్ని దిశల నుండి కలగాలి. వేదాల్లో ఉన్న జ్ఞానం పొందిన తరువాతనే నీవు జీవితానికి సంబంధించిన విషయాల మీద నిర్ణయం తీసుకో. నీవు మంచి కీర్తి గడించి, నీకు భర్తకు శుభాలను కలుగచేసేదానివిగా ఉండు. నీ అత్తవారింట్లో గౌరవప్రదమైన జీవితం గడుపు, నీ జ్ఞానంతో వారి ఇంటిని వృద్ధిపరుచు - అధర్వణవేదం 14-1-64 (ముందు విద్యను పొందండి, ఆ తర్వాతే వివాహం చేసుకోండని స్త్రీలకు ఈ మంత్రంలో భగవంతుడు నిర్దేశించాడు).







# బ్రాహ్మణుల అవస్థలు

ఏదో ఒక సినిమాలో శివుని నమక చమకాల గురించి ప్రణయ గీతాల్లో పెట్టారని బ్రాహ్మణ సమాజం మొత్తం ఐక్యతతో ఒకే గళంగా మాట్లాడి విజయం సాధించిన విషయం అందరికి విధితమే..
ఇప్పుడు మళ్ళీ అదే ఐక్యతా గళంతో పోరాడవలసిన తరుణం ఏర్పడింది. ఎందుకంటే.........

బ్రాహ్మణులనగానే హిందూ సమాజంలో ముందుగా గుర్తకొచ్చేది మన దేవాలయాలు అందులో నిత్యం దైవారాధనలో మెలిగే అర్చకులు.....

ఈ అర్చకులు నిత్యం "సర్వే భవంతు శుఖినహ:" అంటూ జనుల మేలు కోసం, లోక కళ్యాణం కోసం ఆ పరమాత్ముని స్మరిస్తూ దైవ సేవలో జీవనం గడుపుతూ ఉన్న అర్చకులు నానాటికి దేవాలయ అభివృద్ధికి తోడ్పడుతూ భక్తుల కొరకు నానా విధాల పూజలు నిర్వహిస్తూ దేవాలయాలకు ఆదాయం చేకూరుస్తుంటే ప్రభుత్వం ఆ ఆదాయాన్ని అన్య మతస్థుల హజ్, జెరూసెలేం వంటి యాత్రలకు రాయితీల రూపంలో వినియోగిస్తూ రాజకీయ లబ్ధి పొందుతున్నారు.

ప్రభుత్వం వారికి దేవాలయాల ద్వారా ఆదాయాన్ని చేకూరుస్తూ భగవద్యానం తప్ప మరేది తెలియని అర్చకులుకు అంతంత మాత్రంగా ఇచ్చే నెలవారీ జీతాలు తో జీవితాలు గడుపుతున్నా ఏనాడూ జీతాలు పెంచమని అడగని వారనో, ఏదేమన్నా పడుంటారన్న ధీమానో, తెలియదుగాని ఇప్పుడీ ప్రభుత్వం మాత్రం ఒక పక్క బ్రాహ్మల అభ్యున్నతి కోసం కార్పొరేషన్ పెట్టి బ్రాహ్మలను ఆదుకుంటున్నాము అంటూనే మరో పక్క అర్చకుల జీత భత్యాలలో కోతలు విధిస్తూ వారి జీవితాల మీద దెబ్బకొడుతుంటే.....

మనం చూస్తూ ఊరుకోవాలా...
మనం ఎందుకిలా చేస్తున్నారని ప్రభుత్వాన్ని నిలదీసే తరుణం ఆసన్నమైంది.
బ్రాహ్మణలందరూ సంఘటితమై ముక్త కఠంతో ఉద్యమం చేసి మన వారికి జరుగుతున్న అన్యాయాన్ని అడ్డుకోవాలి.

నిత్యం దైవస్మరణలో ఉండే అర్చకుల జీతాలలో కోతలా!! ఆ అర్చకుల వచ్చే దేవాలయ ఆదాయాలు అన్య మతాలకి తరలింపులా!!
ప్రజల ఓట్లతో గెలిచిన ఎం. ఎల్ . ఏ లకు లక్షల్లో జీతాలా!!
ఆ ఎం. ఎల్ ఎ లకు పెంషన్లు వారికి కార్పొరేట్ ఆసుపత్రులలో ఉచిత వైద్య సేవలు!!

మన మనవిరి మీద ఎందుకీ విపక్షం.... ఆలోచించండి బ్రాహ్మణులారా....